క్కయు బిడ్డలయొక్కయు క్షేమమును విచారింపక కలహకారులతోఁ జేరెను. ఈయనాలోచితకృత్యమువలన నాతనిప్రాణములకు చేటుమూడుట యొకవింత కాదు. అతఁడు కలహకారులలోఁ జేరుట జేన్ గ్రే యొక్కయు నామెభర్తయొక్కయు ప్రాణములమీఁదికిఁగూడవచ్చెను. ఆబాలదంపతులకు విధింపఁబడి యింతకాలమునిలిపియుంచఁబడినక్రూర దండనము నెప్పుడు ప్రచారమునకుఁ దేవలయునా యని దయయెట్టిదో యెఱుఁగని మేరీయొక్కమనస్సావఱకే వేగిరపడుచుండెను; ఇంతలో నామెతండ్రి రాజద్రోహియగుటకూడ తటస్థించుట యాసాకుమీఁద దానినితక్షణమే ప్రవృత్తికిఁ దెచ్చుటకవకాశముగలిగించెను. అందుచేత మరణమునకు సంసిద్ధులరయియుండవలసినదని లేడీ జేన్ గ్రేకును తద్భర్తకును వర్తమానముపంపఁబడెను. తనకట్టిగతియెప్పుడో తప్పకకలిగితీఱు నని యెఱిఁగిన దయినందున ప్రాణాశమాని యామె యావఱకే చావునకు సంసిద్ధురాలయియుండెను. ఇట్టిసమయమునందు రోమీయమతోన్మాదినియైన మేరీరాణి కారాబద్ధులాలయియున్న లేడీ జేన్ గ్రేకు విముక్తి కలిగించి యనుగ్రహము చూపఁదలచుకొన్నదానివలెఁ గనఁబడుచు నామె తనరోమీయధర్మప్రతిషేధకమతమును త్యజించి రోమీయ మతము నవలంబించిన పక్షమునఁ బ్రాణదానమును స్వాతంత్ర్యదానమును జేసెదనని చెప్పి పుచ్చి సమర్థులైనట్టియు విద్వాంసులయినట్టియు రోమీయమతాచార్యుల నామెకడకుఁ బలుమాఱు పంపుచు వచ్చెను. రాణియొక్క మతాచార్యుఁడైన ఫెకన్‌హామను నతఁడు రాణియుత్తరువు ననుసరించి స్వమతసిద్ధాంతప్రాశస్త్యము నామెకు బోధించి యామె నేలాగునైన రోమీయమతమునకుఁ ద్రిప్పవలెనని సర్వవిధములఁ బ్రయత్నము చేసెనుగాని యాతనికృషి యంతయు విఫలమయ్యెను. ఆమె తనయొద్దకుఁ బంపఁబడుచు వచ్చిన రోమీయమతాచార్యుల యుక్తులకుఁ బ్రతియుక్తులు చెప్పి ప్రతిపక్షులవాదమును పూర్వపక్షము

చేసి స్వమతసిద్ధాంతములను సమర్థతతో స్థాపించుచువచ్చెను. ఇంత జరిగినను మేరీరాణి యూరకుండకయింకను నామెరోమన్ మతములోఁ గలియునేమోయన్న భ్రమచేత నామెకు మఱి మూఁడుదినములుగడు విచ్చెను. అయినను జేన్ గ్రే యిట్టివంటి ప్రాణసంశయదశలో సహితము తనమనోనిశ్చయమును వదలనిదయి తాను సత్యమనినమ్మి నధర్మమునందు దృఢవిశ్వాసముంచి నిశ్చలురాలయి యుండుటయే కాక యెన్నికష్టములువచ్చినను స్వమతమును మార్చుకొనకుండునట్లు ప్రబోధించుచుఁ దనసహోదరికి గ్రీకుభాషలో నొకలేఖనువ్రాసి యాభాషలోనున్న క్రైస్తవవేదము నొకప్రతి నామెకుఁ బంపెను.

ఆమె ప్రతిక్షణమును దనచావును బ్రతీక్షించుచుండి యావఱకే మరణమునకు సంసిద్ధురాలయి యుండినందున నిప్పు డియ్యఁబడిన గడువామె మనోవ్యధను బెంపుచెందించుటకే తోడుపడెనుగాని మనశ్శాంతిని గలిగించుట కనుకూలపడలేదు. ఇట్టిస్థితిలో నామెకుఁ దండ్రికిఁ దటస్థించిన యాపదలు తెలియవచ్చుటయే కాక యాతఁడు ప్రాణాంతదండన ననుభవించుటకుఁ దానున్న దుర్గములోనికే తీసికొని రాఁబడినట్టు తెలిసెను. ఆసంగతి తెలియఁగానే యామె నిజజనకున కొకలేఖ వ్రాసిపంపెను. దానిలోని కొంతభాగమును దెనిగించి యిందుక్రిందఁ బొందుపఱచుచున్నాము.

"ఓ ప్రియజనకా!

ఎవరివలన నాజీవితకాలము పెంపుచెందవలసినదో యట్టివంటి నీవలననే నాచావును త్వరపఱచుటకు భగవంతుఁ డనుగ్రహించినప్పటికిని, నాయిష్టానుసారముగా నాకు దీర్ఘాయువు నిచ్చి ప్రపంచము నంతను నాయధీనము చేసినయెడల సమర్పించెడు వందనములకంటె నాదుఃఖదినములను హ్రస్వపఱచినందునకయి యధికనిర్వ్యాజవ ద

నమూనలను జేయువాని సమర్పించునంత శాంతతతోనే నేనుదానిని స్వీకరింపఁగలను. నీకష్టములనుగూర్చి నీవు పొందుచుంటివను నిశ్చయమైన నేను విన్నదానినిబట్టి ముఖ్యముగా నాదుఃఖకరమైన స్థితినిగూర్చి నీవు పొందుచుంటివను శోకాతిశయమును నేను నిశ్చయముగా నెఱుఁగుదును. నాప్రియపితా! అయినప్పటికిని నాచేతులను నిర్దోషిత్వజలమునందు కడుగుచు నానిర్దుష్టరక్త వినాశ్వరసమ్ముఖమున 'నిరపరాధులను దయ చూపవలె' నని ఘోషింపఁ గలదగుటచేత నన్ను ధన్యురాలినిగాఁ బరిగణించుకొనవచ్చును. అయినను నీవు చక్కఁగా నెఱుఁగియున్నట్లుగా నిర్బంధపెట్టఁబడియు విరామములేకుండఁ బీడింపఁబడియు నేను (రాజ్య) భారమును పైని వేసుకొనుటకు సమ్మతించినట్లు కనఁబడి యుండుటవలనను రాణిబిడ్డలను దుర్భాసనములతోడుతను మహాపరాధమును జేసినదాన నయినట్లు నేనొప్పుకొనవలసియున్నప్పటికిని, నారాజ్ఞీ వేషధారణముచేఁ బ్రాప్తమైన నిర్బంధ నిహితగౌరవ మెన్నఁడును నానిర్మల హృదయముతోఁ జేరినది కాకపోవుటచేత నీశ్వరవిషయమునందు నానాయపరాధ మల్పతర మయినదని నేను నిశ్చయముగా నమ్ముచున్నాను.

ఓసన్నపితా! ఈప్రకారముగా నే నిప్పుడున్న స్థితిని నీకు వెల్లడి పఱిచియున్నాను. నామరణము సమీపించినది.

ఇది యొకవేళ దుఃఖకరముగాఁ గనఁబడ వచ్చినప్పటికిని, నాదుఃఖగంభీరుఁడై వెలువడి రక్షకుఁడైన క్రీస్తునాథునితోఁగూడి నిత్యసుఖసంతోషప్రదమైన స్వర్గసింహాసనమునం దుండఁగోరుటకంటె నధికప్రియతరము కాఁగలిగినది మఱియొకటి లేదు; (ప్రతిక ఖండి కొటు వారియొకట న్యాయమయిన పక్షమున) దేవునియందలి దృఢభక్తి

యుండును నీ కింతవఱకును బలము నిచ్చినట్టి ప్రభువు కడపట మనము పరలోకములో తండ్రితోను కుమారునితోను పరిశుద్ధాత్మతోను గలిసి కొనుటకు నీకా బలమునే ముందును బ్రసాదించును గాక !

ఇట్లు,

మరణపర్యంతము నీవిధేయపుత్రికయైన

జేన్ డడ్లీ.”

లేడీ జేన్ గ్రే చెఱసాలలో నున్న కాలములోఁ దన యప్పటి యవస్థకు సరిపోవునట్లుగా ననేక ప్రార్థనలను పద్యములను రచియించెను; మరణదండనమును బొందుటకు పూర్వపు రాత్రిసహిత మామె వానిని దిద్దునంతటి దృఢమనస్సు గలదయి యుండెను. ఇటువంటి ప్రాణసంశయావస్థలో సహితము రోమీయమతాచార్యు లామెయొద్దకుఁ బోయి యామెను స్వీయమత ప్రవిష్టురాలినిగాఁ జేయుటకయి బోధచేసిరఁట. ఆమె పర్వతమువలె నచంచలురాలయి కడనిమిషము వఱకును రోమీయధర్మ ప్రతిషేధకమునందే సుస్థిరురాలయి తదేకదీక్షతో నుండెను. తెల్లవాఱి తన్ను శిరచ్ఛేదము చేయుదురనఁగా నారాత్రి యామె తన సహోదరియైన కేథరైనుకు గ్రీకునూతననిబంధన గ్రంథమును బంపుచు దానిలో వ్రాసిన లేఖకు భాషాంతరమిది—

“ప్రియసహోదరివైన యో కేథరైనా! పయిభాగము బంగారముతో నలంకరింపఁబడక పోయినను లోపల నమూల్యరత్నములకంటెను నెక్కువవెల కలదయిన పుస్తకమును నీకుఁ బంపుచున్నాను. ఓ ప్రియసోదరీ! ఇది యీశ్వరశాసనములను గలిగిన పుస్తకము. ఇది చిరస్థితి కలవారయిన మనకు ప్రభువు విడిచిన తనసంహితయు మరణశాసనమునయి

యున్నది; ఇది నిన్ను శాశ్వతసంతోషమార్గమునకు నడపును; దీనిని నీవు మంచిహృదయముతోఁ జదివినను నిష్కపటహృదయముతో ననుసరింపఁ బూనినను నీకిది నాశములేని శాశ్వతజీవనమును దెచ్చును. ఇది నీకు బ్రతుకువిధమును చచ్చువిధమును నేర్పును. నీతండ్రియొక్క యధికమయిన భూములవలన నీవు పొందవలసినదానికంటె నీకిది యెక్కువ లాభమును గలిగించును. దేవుఁ డతనికి మంచిస్థితిని గలిగించినందున నీవాతనిభూములను బొందవలసినట్లుగానే, దీనిలో విధింపఁబడినప్రకారముగా నడుచుట కపేక్షించుచు దీనిని నీవు శ్రద్ధతోఁ జదివెడుపక్షమున దురాశాపరులు నీయొద్దనుండి గైకొనలేనట్టియు దొంగలు తస్కరింపలేనట్టియు పురుగులు పాడుచేయలేనట్టియు దివ్యధనమును నీవు దాయముగాఁ బొందుదువు. ఓనాధుసోదరీ! డేవిడ్డువలె నీవును ప్రభువైన దేవునియొక్క శాసనములను గ్రహింపఁ గోరుము. నీవు మరణమువలన నిత్యజీవనమును బొందునట్లుగా శాంతితోఁ జచ్చుటకు బ్రతుకుము. నీ లేఁబ్రాయము నీకు దీర్ఘాయువు నిచ్చునని నమ్మకొనకుము— దేవునియాజ్ఞయైనపక్షమున ముసలివారెంతశీఘ్రముగాఁ బోవుదురో యంతశీఘ్రముగానే పసివారునుబోవుదురు. ఎట్లుచావవలయునో నేర్చుకొనుటకయి యెల్లప్పుడును పాటుపడుము. ప్రపంచమునకు బ్రతిఘటింపుము; పాపమును బాఱఁద్రోలుము, ఇంద్రియసుఖములను దిరస్కరింపుము; ప్రభునందే యానందమును బొందుము. నీపాపములకయి పశ్చాత్తాపపడుము; ఎప్పుడును నిరాశనుమాత్రము పొందకుము. భక్తియందు దృఢచిత్తురాలవు గమ్ము, గర్వపడకుము. ఎవఁడు మృతి నొందియు జీవించియున్నాఁడో యట్టివంటి క్రీస్తుతో నుండుటకు సెయింటుపాలువలెఁ గోరుము. అర్ధరాత్రమునందు దొంగవలె వచ్చి మృత్యువు నిన్నపహరించునేమో యన్నట్లు సద్భటునివలె రాత్రిసహితమునీవు జాగరూకురాలవయి యుండుము. * * * నావలెనే నీవు క్రీస్తునం

దానందముపొందుము. నీప్రభువైన క్రీస్తునియొక్కమార్గమునననుసరించి నీసిలువను వహింపుము. నీపాపముల నాయనపైపుమీఁదవేసి, నీవాయ నమార్గము నెల్లప్పుడు ననుసరింపుము. "ఓసహోదరీ! ఈదుష్టభా వమునుండి విముక్తి నొంది నిర్దుష్టతను బొందఁ బోవుచున్నానుగనుక నామరణమునుగూర్చి నావలెనే నీవును సంతోషింపుము. ఈయస్థిరజీవ నమును బోఁగొట్టుకొనుటచే సుస్థిరజీవనమును బొందుదు నని నాకు నిశ్చయముగాఁ దెలియును. భగవంతుఁడు నాకది ప్రసాదించి, ఈశ్వర భీతితో బ్రతికి నిజమైనక్రైస్తవభక్తురాలఁ జచ్చునట్లుగా నీకనుగ్రహిం పవలయు నని ప్రార్థించుచున్నాను. జీవితాశచేతఁగాని మృత్యుభీతి చేతఁగాని నీవాయమార్గమునుండి యెప్పుడును తొలఁగకుండుట కీశ్వర నామమున నేను నీకు బోధించుచున్నాను. నీజీవితమును దీర్ఘముగాఁ జేసికొనుటకయి నీ వాతనిసత్యమును నిరాకరించినపక్షమున నిన్నా యన నిరాకరించి నీదినములు హ్రస్వముచేయును; నీవాయన నె య్యాశ్రయించి యున్నపక్షమున, నీకు సౌఖ్యము దనకు మహిమయుఁ గలుగునట్లుగా నతఁడు నీయాయువును దీర్ఘము చేయును. ఆపదవికి భగవంతుఁడు నన్నిప్పుడు కొనిపోయి, ఆయన యనుగ్రహము వచ్చి నప్పుడు ముందు నిన్నుఁ గొనిపోవును. ఓసహోదరీ! నీకు శుభ మగునుగాక! నీవీశ్వరునియందే విశ్వాసముంచుము; అతఁడొక్కఁడే నీకు సహాయుఁడు కావలెను."

వారివధదినమునందు గిల్ఫోర్డుప్రభువు తనభార్య యైన జేన్ గ్రేను సందర్శింపఁ గోరఁగా మేరీరాణి వారిసమావేశమున కియ్య కొనెను. కాని, లేడీ జేన్ గ్రేయే యందు కంగీకరింపక, తమసమా వేశానంతరవియోగదుఃఖ ముభయులధైర్యమును జెడఁగొట్టి యవసాన దశయందుండవలసిన మనస్స్థైర్యమునకు భంగము కలిగించుననియు,

వారియీవిరహము కతిపయనిమిషపరిమితమయినదే యయినందునఁ గొంచె మోర్చినయెడల నెక్కడ నన్యోన్యానురాగబంధము తెంపులేక నిరంతరముగా నుండునో యెక్కడ మృతియు నాశాభంగమును దురదృష్టమును జేరి శాశ్వతానందమునకు భంగము కలిగింపలేవో యక్కడఁదా మన్యోన్యసమావేశము నొందవచ్చుననియు, సందేశము పంపెను.

౧౫౫౪ వ సంవత్సరము ఫిబ్రవరి నెల పండ్రెండవతేది సోమవారమునాఁడు వధూవరులలో గిల్ఫోర్డు ప్రభువు శిరశ్ఛేదమునకయి ముందుగా వధ్యస్థానమునకుఁ గొనిపోఁబడెను ; అతఁడు పోవునప్పుడామె గవాక్షములోనుండి చూచి తనస్మరణచిహ్నమునొకదాని నాతనికొసఁగి యీశ్వరధ్యానము చేయుచు తనగడియ వచ్చువఱకును మనశ్శాంతితో వేచియుండెను.

గిల్ఫోర్డుప్రభువు తన ప్రాణావసానసమయమునందు ధైర్యమునుగాని చిత్తస్థితినిగాని యణుమాత్రమును గోలుపోక, తననిమిత్తమయి కాచుకొనియున్న మిత్రులందఱియొద్దకు సెలవు గైకొని, దృఢచిత్తముతో వధ్యస్థానము నధిరోహించి, యచ్చటఁ గొన్నినిమిషము లీశ్వరధ్యానమునందుఁ గడపి, మూఁకలుగా మూగియున్న జనులను తనకొఱకుఁ బ్రార్థింపుఁ డనిపలికి, వధ్యదారువుమీఁదనిజశిరస్సును మోపెను. మఱియొక్క నిమిషములో నాతనిశిరస్సు మొండెమునుండి ఖండింపఁబడెను.

గిల్ఫోర్డు ప్రభువు శిరశ్ఛేదము చేయఁబడినతోడనే పురాధికారులువచ్చి యామెను వధ్యస్థానమునకుఁ గొనిపోవలసినగడియ వచ్చినదని లేడీ జేన్ గ్రేతో విన్నవించిరి. ఆయాజ్ఞ తెలుపఁబడినప్పు డామె కంపవైవర్ణ్యాదిభయచేష్టలను వేనినిబొందక నిశ్చలధైర్యముతో వినెను. ఆమె వధ్యస్థానమునకుఁ గొనిపోఁబడుచుండినప్పుడు దారిలో సమాధి

నిమిత్తమయి బండిలో వేసి తీసికొనిపోఁబడుచున్న శిరోవిహీనమైనభర్తృ కళేబరమామె కంటఁబడెను. భర్తృశవము నేత్రగోచరము కాఁగానే యామె కన్నులనుండి జొటజొట నీరుకారు నారంభించెనుగాని, ప్రాణోత్క్రమణసమయమునందు సహిత మతఁడు ధైర్యమును విడువలేదన్న వార్తాశ్రవణమువలన దుఃఖము నాపుకొని మఱింత మనోదార్ఢ్యము నొందినదయి ధైర్యమునుబూని "గిల్ఫోర్డా! నీవు చవిగొన్నట్టియు నేను చవిగొనఁబోవుచున్నట్టియు మృత్యురూపఫలము నన్ను కంపమునొందించునంతటి చేఁదైనది కాదు. ఈదినమున నీవును నేనును గూడి స్వర్గములో ననుభవింపఁబోయెడి విందుతోఁబోల్పఁబడినప్పుడిది పేర్కొఁదగిన దేకాదు." అనిపలికి తన పలకపుస్తకములో నేదో వ్రాసెను. వధ్యస్థానమును సమీపించినప్పుడు దుర్గారక్షకాధికారియైన సర్ జాన్ గేజి యనునతఁ డామెనుజూచి తనస్మరణార్థముగాఁ దాను స్థిరముగా నుంచుకొనుటకై దన చిన్నపారితోషికము ననుగ్రహింపవలసిన దని యామెను వేఁడుకొనెను. భర్తృశవమును జూచినప్పుడింతకుముం దామె స్వహస్తముతో గ్రీకుభాషతో "మానుషికన్యాయ మాతని దేహమునకుఁ బ్రతికూలముగానున్నను, ఈశ్వరకారుణ్య మాతనియాత్మ కనుకూలముగా నుండు" ననియు, లాటిన్ భాషతో "ఆమెయపరాధము దండనమున కర్హమయినది యైనయెడల అధమపక్షమామెబాల్యమును లోకానుభవరాహిత్యమునుక్షమార్హములయినవి" యనియు, ఇంగ్లీషు భాషతో "ఆమె దేవుని నమ్ముకొనెను గాన భావికాలప్రజ లామెయెడల దయచూపుదురుగాక" అనియు, అర్థమిచ్చెడు మూడువాక్యములను వ్రాసినపలకపుస్తకము నామె యాతనికిచ్చెను. ఆమె యుప్పుడొకసేవకురాలికి చేజోళ్ళనిచ్చెను. ఇయ్యవలసిన వాప్తజనుల కిచ్చి యామె నిర్భయముగా వధ్యవేదికపైకెక్కి యక్కడఁ గూడియున్న

ప్రభులకు మ్రొక్కి ముందుమూఁగియున్న పౌరులవంకఁదిరిగి యిట్లని యెను—

"నాప్రభువులారా! నాచావుఁ గాంచవచ్చిన సత్క్రైస్తవజనులారా! నేనిప్పుడు శిక్షాస్మృతికి లోఁబడియున్నదానను. తప్పొప్పులను జేయనిన్యాయాధిపతివంటి దైన యీశిక్షాస్మృతిచేత నేను వధింపఁబడునట్లు విధింపఁబడియున్నాను. ఇది నేను జేయునట్లు నిర్బంధపఱుపఁబడినట్టియు నే నెప్పుడును గ్రహింపనిదానిని నేను జేసి యపరాధిని నయినట్లు శిక్షాస్మృతి నిర్ణయించినట్టియు పని నే నొప్పుకొన్నందుకుమాత్రమే కాని రాణిగారికి విప్రియమైన యే పనికొఱకునుగాదు; ఏలయన, దానినుండి నాచేతులను శుద్ధిచేసుకొని, అన్యాయమునుండి నిర్దోషిత్వమెట్లో యట్లే యాయువంశీకోపమునుండి పరిశుద్ధమయిన నాయాత్మను దేవునకు సమర్పించుచున్నాను. అది యట్లున్నను నాయింద్రియసుఖవాంచలను నిర్భాగ్యప్రపంచసుఖములను నత్యధికముగా నవలంబించినందువలనను, భగవంతుఁడు నాకుఁ బ్రసాదించినజ్ఞానానుసారముగా నేను బ్రవర్తింపనందువలనను, నేను దేవునియెడల నపరాధిని నయి యున్నదానను. అందుచేత దేవుఁడు నాకీమరణమును విధించియున్నాఁడు; నాకృత్యములనుబట్టి నేను దీని కత్యంతపాత్రురాల నయియున్నాను. ఇక్కడ నీలోకములో నాపాపములకై యనుతాపపడుటకును నాపూర్వ దురభిమానములచేత విశేషముగా నేనప్రియ మొనర్చిన నారక్షకునియొక్క ప్రసన్నతను మరలఁ బొందుటకును నాకవకాశమిచ్చినందున నే నాతనికి హృదయపూర్వకముగా వందనముల నర్పించుచున్నాను. కాఁబట్టి నా ప్రభువులారా! సత్క్రైస్తవులైన సర్వమహాజనులారా! తన విషయమున నేను జేసిన యపచారము లెంతలెక్కలేనివిగాను ఘోరమైనవిగాను నున్నను దేవుఁడు తనయపారకరుణతోను సద్భావముతోనువానిని క్షమించునట్లుగా నేను బ్రాణములతో నుండఁగానే నాతోడను నానిమి

త్తమును భగవంతునిం బ్రార్థించుటకు మిమ్మందఱను నేను మహో త్కంఠతో వేఁడవలసియున్నది. నేను క్రైస్తవభక్తురాలనయి చచ్చు చున్నానని సాక్షులుగా నిలుచుటకు మిమ్మందఱను వేఁడుకొనుచున్నాను. నాసమస్తకర్మలను పుణ్యకార్యములనదూరముగా విసరివైచి, రక్షకుఁడైన జీసస్ క్రైస్తుయొక్క రక్తమువలనను క్షమమువలనను యోగ్యతవలనను మాత్రమే రక్షింపఁబడుదునుగాని యితరసాధనములవలనఁ గాదు. నాసుకర్మలను నాయోగ్యతలను మాత్రమే నమ్ముకొన్నయెడల నవి నాకర్తవ్యముల కంటె హానికరములై నన్ను నరకగతిపాలు చేయఁదగినవిగా నున్నవి! అప్పుడు నాకోసము నాకొఱకును మీరందఱును ప్రార్థనచేయ వలయునని మిమ్ము ప్రార్థించుచున్నాను."

పయివాక్యము లామెస్వాభావికహృదయశాంతతను సౌజన్యమును వినమ్రతను దేటపఱచుచున్నవి. ఆమె తనవిషయమునఁ జూపఁబడిన క్రౌర్యవిషయమునఁ బరుల నొక్కపరుషోక్తియైనను బలుకలేదు. దోషమునంతను దనమీఁదనే వేసికొని, దానికి కారణము రాజ్యకాంక్షగాక జననీజనకులయాజ్ఞోల్లంఘనముచేయ లేకపోవుటయే యని విన్నవించెను. ఈమాటలుపలికిన తరువాత నామె తనవెనుక నున్నపరిచారికాద్వయమును బిలిచి తన మీఁదివస్త్రములను దొలఁగింప నియమించెను. కన్నులనిరుకారఁగా, చేతులు వడఁకఁగా, మేను చెమర్పఁగా వారు వస్త్రములను దొలఁగింపఁజేతులారక నిశ్చేష్టలయినిలువఁబడినందున, ఆమె యాపని తానేచేసెను. పరిచారికలు వెనుకనిలువఁబడి మొగమునకు గుడ్డ లడ్డముపెట్టుకొని కన్నీటికాలువలు తుడుచుకొనుచు నేడ్చుచుండిరి. అపుడు ఘాతకపురుషుఁ డామెపాదముల మీఁదఁబడి క్షమింప వేఁడుకొనఁగా, ఆమె తత్క్షణమే వానిని క్షమించితి నని చెప్పి "ఓయీ! దయచేసి నన్ను శీఘ్రముగాఁ దుదముట్టింపుము" అనివేఁడి,

"ఓ యీశ్వరా! నాయాత్మను నీచేతులలో బెట్టుచున్నాను." అని విస్పష్టమైన యుచ్చైస్స్వనముతోఁ బలికి శాంత మైనట్టియు నిర్వికార మైనట్టియు ముఖభావముతోఁ దనశిరస్సును వధ్యదారువుపై బెట్టెను. ఉత్తరక్షణముననే వధకారిచేతిఖడ్గ మామెయుత్తమాంగమును త్తరించెను. అప్పుడు చూడవచ్చిన గుంపులోనుండి హాహానినాదములును రోదనధ్వనులును బైలువెడలెను.

పదునేడుసంవత్సరముల ప్రాయమప్పుడుదార చిత్తురాలయినట్టియు స్త్రీజనాలంకారములైనసమస్తసద్గుణరత్నములచేతనుభూషితురాలయినట్టియు నిష్కళంక సౌశీల్య ధైర్యాభిమానమాననీయు రాలయినట్టియు లేడీ జేన్ గ్రేయొక్క యైహికజీవిత మిట్లు పరిసమాప్తి నొందెను. డాక్టరు ఫుల్లరనువిద్వాంసుఁ డీమెనుగూర్చి "శైశవమునందలి నిష్కాపట్యమును, యౌవనమునందలి సౌందర్యమును, కౌమారమునందలి దృఢత్వమునుఁ వార్ధకమునందలిఘనతను అన్నిటిని పదునేడేండ్ల ప్రాయమునందే యీమె కలిగినదయ్యెను. రాజకుమారియొక్క జననమును విద్వాంసునియొక్క పాండిత్యమును, ఋష్యాశ్రమునియొక్క జీవనమును, తల్లిదండ్రుల దోషమునుబట్టి పాపకర్మునియొక్కచావును నీమెకుఁదటస్థించెను." అని వ్రాసియున్నాఁడు.

లేడీ జేన్ గ్రే యవసానదశయందుఁ జెఱసాలలో నుండినప్పుడు వ్రాసిన యనేకప్రార్థనలలోఁ గడపటిదానిని మాత్రము తెలిగించి యీమెశోచనీయమైన చరిత్రమును ముగించుచున్నాము—

"ఓప్రభువా! ఈశ్వరుఁడా! నాజీవజనకా! అన్నికష్టములందును దుఃఖములందును మాత్రము నీయొద్దకుఁ బరుగెత్తుచు గతిమాలి యేకాకినినయియున్న యబలనగు నామొఱ్ఱ యాలకింపవు. ఓప్రభువా! నీయందు విశ్వాసముంచినవారిని రక్షించి ముక్తినొసఁగెడు వాఁడవు

నీవొక్కఁడవే. కాఁబట్టి పాపముచేఁ గళంకితురాలనయి, క్లేశములచేఁ గప్పఁబడినదానవయి, కష్టములచే శాంతిలేనిదానవయి, చింతలచేఁజుట్టు కొనఁబడినదానవయి , ఆపదలచేనాక్రమింపఁబడినదానవయి, దీర్ఘకాల కారాబద్ధనచే నత్యంత బాధితమై పనికిమాలిన మట్టిముద్దయైన యీనా పాపపుబోదిని గలదానవయి, ఓదయామయుఁడవైన రక్షకుఁడా! ఏవి లేక మోక్షకాంక్ష కించుకయైన నవకాశ ముండదో యట్టివంటి నీదయను సాహాయ్యమును వేఁడుచు, రక్షణవిషయమున సంపూర్ణనిరాశ కలుగకుండ నేను నిశ్చయించుచున్నాను. మాజీవితము శోధన మీఁదనే నిలిచియుండునుగాన, మేము నీవారమగుదుమో కామో పరీక్షింపఁబడుటకును నిన్నును మమ్మును బాగుగాఁ దెలిసికొనఁ గలుగుటకును కొన్ని సమయములయందుఁ గొన్ని విపత్తులనుమాకుఁగలిగించుట యుక్తమేయైనను, మాశక్తి కిమించినదుర్భరకష్టములతో మమ్ముశోధింపనని పలికినవాఁడ వగుటచేత నగతికురాలయిన యీదీనురాలిని గరుణింపుము. ఓయీశ్వరుఁడా! అత్యున్నతస్థితిఁ బొంది నిన్ను మఱవకుండునట్లుగను, అతిహీనదశనొందినిరాశచే రక్షకుఁడవును ప్రభువునునైన నిన్ను నిందింపకుండులాగునను,నన్నతిమాత్రసంపదలచేనుబ్బింపకుండుటకును అతిమాత్రవిపత్తులచేక్రుంగింపకుండుటకునుప్రార్థించెదను.ఓకరుణానిధీ! నీకెక్కువగాఁ దెలిసిన నాదుస్థితిని విచారించి, నారక్షణమునకయి నీవు బలిష్ఠమైన పెట్టనికోటవు కమ్ము. నేను వినమ్రతతో వర్తించుచున్నాను. నన్ను నాశక్తికి మించునట్లుగా శోధింపఁబడనీకుము. నన్ని మహాకష్టములనుండి విమోచనము నేయువాఁడవైనను గమ్ము; లేదా, యీదుర్భరబాధను క్రూరదండనమును శాంతతతో సహించుటకుసమర్థనైనను నాకనుగ్రహింపుము. నన్నూఱు సంవత్సరములకాలము బాధించి దాస్యములోనుంచిన ఫారవో చేతులలోనుండి యిశ్రాయేల్ ప్రజలను రక్షించినది నీదక్షిణహస్తమే. ఎవరికొఱకు నీకుమారుఁడైన

క్రీస్తువు తన యమూల్యరక్తమును సిలువమీఁదఁ జిందఁజేసెనో యతని వంటి శోచనీయులైన యభాగ్యులలో నొకతెనైన నన్ను నేనిప్పుడున్న దుఃఖకరమైన చెఱనుండియు బంధమునుండియు విముక్తిఁబొందించుట నీపితృవాత్సల్యమునకు స్వామ్యమగునుగాక! ఎంతకాలము నీవు కనబడకుండెదవు? ఎల్లకాలమునా? ఓప్రభువా! దయచూపుటను నీవుస్మరించి యున్నావా? అసంతుష్టుడవై ప్రేమపూర్ణమైన నీకారుణ్యా పేటికనుమూసి యున్నావా? నిన్నిఁకఁ బ్రార్థింపవలసినపని లేదా? నీదయ యెప్పటికిని రాకుండఁ బూర్ణముగా నశించినదా? నీయభయప్రదానము సంపూర్ణముగా సమాప్తిఁబొందినదా? నీవింత చిరవిలంబ మేలచేయుచున్నావు? ఓప్రభువా! ఇకనీకు దయరాదని నిరాశ చేసికొనా? అట్టిది నాకు దూరమగునుగాక! నేనును నీసన్ క్రీస్తును సృజించిన సృష్టిలోనిదాననే. కాఁబట్టి నీకెప్పుడు దయవచ్చునో యప్పుడు రక్షింతువని నిశ్చయముగాఁ దెలిసికొని నీకు నాయెడ గలదయను సందేహముగాని విశ్వసింపకుండుటగాని మాని, నీయవకాశము నిమిత్తము వేచియుండుటకును నీపనులను శాంతతతోసహించుటకును నాకు జ్ఞానమొసంగుము. నాకేది మంచిదో యదినాకంటెనీ కెక్కువ తెలియునుగనుక, సర్వవిషయములలోను నీవు నాకెట్లుచేయఁదలచుకొన్నావో యట్లుచేయుము, నీయిష్టము వచ్చిన కష్టములను కలిగింపుము. నిన్ను వేడుకొనుచున్నాను. ఈమధ్య కాలములో నానడుమును సత్యమను నడికట్టుతో బిగించి సాధువృత్తి మనెడి యురస్త్రాణమును ధరించి, శాంతిసువార్తయనెడు దుర్భేద్యచర్మ నిర్మిత పాదరక్షలపై నిలిచి, అన్నిటికంటెను ముఖ్యముగా దుర్మార్గుల దౌష్ట్యాగ్ని బాణముల నన్నిటి నార్పివేయుటకు శక్తి కలుగునట్లుగా భక్తిఖేటమును వహించుము ముక్తికిరీటమును నీపవిత్రవాక్యమైన యాధ్యాత్మిక ఖడ్గమును దాల్చి, నేనుపూర్ణముగా నీయిచ్ఛ కాత్మార్పణము చేసి నీయిష్టమునకు బద్ధురాలనగుదు, ఇట్టి కష్టములు నాకు శుభకరము

## Miss MARY CARPENTER.

## మేరీ కార్పెంటరు.

మేరీ కార్పెంటరను నామె యేకేశ్వరబోధక (త్రైత్వనిషేధక) క్రైస్తవమతాచార్యుఁడైన డాక్టరు లాంటుకార్పెంటరుగారి జ్యేష్ఠ పుత్రిక; ఆమె తల్లిపేరు పెన్. ఈదంపతులకీమె 1807వ సంవత్సరము ఏప్రిల్ నెల మూడవ తేదిని ఎక్సిటర్ పట్టణములో జననమొందెను. ఆమె తండ్రి తాను మతాచార్యుఁ గానుండి పెద్దవారికి ధర్మోపదేశము చేయుచుండుటయేగాక యుపాధ్యాయుఁడుగా నుండి పిన్నవాండ్రకు జ్ఞానోపదేశము చేయుచుండెను. అందుచేత నామె తనజనకునిశిక్షలోనే విద్యాభ్యాసము చేసెను. ఆమె సాధారణముగా నెల్లవారును నేర్చు కొనెడి యింగ్లీషుభాషనుమాత్రమేగాక గ్రీకుభాషనులాటిను భాషను గణితశాస్త్రమును నేర్చుకొని యందుఁ బ్రవీణురాలయ్యెను. తండ్రి యామెకు నీతివిద్యను గఱపుటయం దత్యంతశ్రద్ధ వహించుచుండెను. ఆమె ప్రకృతిశాస్త్రములకు జంతుశాస్త్రమునుగూడఁ జదివి వానియందు మిక్కిలి యభిరుచి గలదయ్యెను. ఈమె చెల్లెండ్రును తమ్ములునుగూడ నించుమించుగా నీమెతో సమానముగానే విద్యాలాభమును బొందిరి. ఈమె తనవిద్యను గూర్చి యెదుటవారి కొకప్పు డిట్లు వ్రాసెను—"విద్య న న్నెప్పుడును గృహకృత్యనిర్వహణమునకు నసమర్థురాలినిగాఁ జేయ లేదు, అట్లు చేయకపోవుటయేగాక యది నాస్త్రీధర్మమును నిర్వహించు టకు నన్ను మఱింత పూర్ణముగా యోగ్యురాలిని జేసినది." ఈమె చిఱుతప్రాయమునందే తల్లికి శ్రమ కలుగకుండఁ దనముద్దుచెల్లెం డ్రను ముగ్గురుతమ్ములను సర్వవిధములచేఁ దానే పెంచుచు వచ్చెను.

ఆమెకు పదేండ్లప్రాయమప్పు డనఁగా 1817వ సంవత్సరమునం దామెతండ్రి యెక్సిటరునువిడచి బ్రిస్టల్పురమును జేరి, తొంటివలెనే యచ్చటఁగూడ ధర్మోపదేశవిద్యోపదేశముల రెంటిని స్వవృత్తినిగా

నేర్పఱుచుకొనెను. ఈమెకుఁ దండ్రి తనశిష్యులైనబాలురతోఁ గలిపియే విద్య చెప్పుచు వచ్చెను. తరువాత మహాకీర్తిమంతుఁడును ప్రసిద్ధికెక్కిన రివరెండు డాక్టరు జేమ్సు మార్టినోగారు 1819 వ సంవత్సరమునందు డాక్టరు కార్పెంటరుగారికి శిష్యుఁడయి మేరీకార్పెంటరుకన్యకు సహపాఠి యయ్యెను. ఆమె పదునేనేండ్లదిని తండ్రి యామెకు తనశిష్యులలోని చిన్నవయస్కులకు విద్య చెప్పుపని నప్పగించుచు వచ్చెను. ఆపనియందామె కనుపరచిన కలిమియు బలముచేత నామె యాపని సత్యంతోత్సాహముతోను పూనికతోను నేర్పుతోను జేయుచువచ్చెను. ఆమె తనతండ్రిగారియొక్క యుపాసనాలయముతో సంబంధించిన భానువార (ధర్మోపదేశ) పాఠశాలయం దత్యంత ప్రీతి కలదయి యత్యంతశ్రద్ధతోఁ బనిచేయుచు వచ్చెను; ఆమె యచటకు భానువారము నాఁడు పోయి విద్యార్థులకు ధర్మపాఠములను జెప్పుటతో మాత్రము తృప్తినొందక, వారితోఁగూడ వారియిండ్లకు బోయి వారితల్లిదండ్రులతో మైత్రిచేసి, ఆ స్నేహవ్యాప్తిని జేకొనెడు కృషిలో వారికి సహాయురాలగుచు వచ్చెను.

ఇరువదియొక్క సంవత్సరములు నిండి వ్యవహారయోగ్యత వచ్చిన తరువాత 1828 వ సంవత్సరములో తండ్రి యామె కిట్లు వ్రాసెను— "నీవు త్రొక్కవలసినట్లుగా శాసింపఁబడబోయెడుమార్గ మేదియో మే మెఱుఁగము; అయినను సర్వలోకపిత యంతయు, నీవు క్రీస్తున కవ్యాజసేవకురాల వగుదువుగాక యనియు, నీయాత్మరక్షణమునకయి పనిచేయుచు క్రైస్తవపరిపూర్ణతవైపు ముందుకు నడుచుచు నీకేర్పఱుపఁబడినపని నితరులయుపయోగముకొఱకు నిర్వర్తించుటకు శక్తురాల వగుదువుగాక యనియు, విశ్వాసముతోను శాంతతతోను పూనికతోను ఈశ్వరేచ్ఛనును చెల్లింతువుగాక యనియు, కోరెడుకోరికలో నడఁగి యున్నట్లు మేము భావించుచున్నాము."

చావడిని కట్టించెను. ఈమె పాఠశాలలను శుభ్రముగాను సుందరముగాను నుంచి హృదయాకర్షకములుగాఁ జేయుచుండెను.

1854 వ సంవత్సరమునందు బైరన్ ప్రభ్వి బ్రిస్టల్ నగరములో కార్పెంటరుకన్య విచారణక్రింద నుంచుటకయి యొక బాలికాదోషనివారకవిద్యాలయము నిమిత్తము "శోణగృహం (Red Lodge) మనఁబడెడు విశాలమందిరమును గొని యిచ్చెను. ఆరంభమునందు దానిలో పదునారు బాలికలుమాత్రమే యుండిరిగాని 1858వ సంవత్సరమున కేఁబది యిద్దఱు బాలికలుండిరి. దోషులుగా శిక్షింపఁబడిన నూఱులకొలఁది బాలికలందుఁ జేరి యవమానకరముగనున్నట్టియు నపకీర్తికరమయినట్టియు జీవనమునకు లోనుగాకుండ రక్షింపఁబడియిప్పుడు మాననీయ సేవకురాండ్రును కుటుంబభార్యలునునయి గౌరవనీయమైన స్థితులను బొందియున్నారు. ఈవిషయములలో నామెకు కార్యవిజయము కలుగుటకు ముఖ్యకారణము తనతోడిమానవులలో నత్యంతభ్రష్టులగువారియెడల సహితము నామెకుఁగల ప్రేమమును సదయత్వమును నయియున్నవి. ఎంతనీచదశలో నున్న పిల్లలనైనను తన కుటుంబములోనివారివలెఁ జూచి యామె యాదరించుచుండెను. "మనమొకబాలునిఁగాని బాలికనుగాని దోషవిముక్తిగలిగించి బాగుచేయఁ దలఁచుకొన్న పక్షమున నట్టివారిని కుటుంబములో నుంచవలెను. ఏపనినైనను వారి నాదరించి మంచిమాటలతోఁ జేయింపవలెనుగాని బలవంతపెట్టి చేయించుటవలనఁ బ్రయోజనములేదు. మనము వారి స్వేచ్ఛ కెప్పుడును భంగముచేయరాదు; వారిని నెమ్మదిక్రమముగా నడవ నేర్చుకొనునట్లు దిద్దవలెను. పతితులయి మిక్కిలి చెడిపోయిన వారిలోపల సహితము మఱుఁగియుండెడు మంచిని బయిటకుదీసి, యది చెడుగును జయించునట్లుచేయుట యెల్లప్పుడును మనగుఱియై యుండవలెను." అని యామెపలుమాఱు పలుకుచుండెను. శోణగృహదోష

నివారక విద్యాశాల యిప్పటికిని జయప్రదముగా నడుపఁబడుచున్నది. ఆమె పాఠశాలల కనుబంధముగా నప్పుడప్పు డేర్పఱచుచు వచ్చిన సమాజములు మొదలగునవి సహితము పాఠశాలలంత యుపయోగ కరములుగానే యుండుచువచ్చెను. వానిలో శ్రామిక మందిరము; అక్కడ కార్మికులు వారి దినచర్య వార్తాపత్రికలను పుస్తకము లును జదువుచు ; దానిపై యుపన్యాసమందిరములో సాంఘిక విషయములు నీతివిషయములు మొదలగు యుపయుక్తాంశములను గూర్చి యుపన్యాసము లిప్పింపఁబడుచుండెను. అందులోనే సురాపాన నివారణసమాజసభలు జరుగుచుండెను.

ఆమె కేఁబది సంవత్సరములు వచ్చినప్పు డామె తల్లి 1865 వ సంవత్సరమున మృతినొందెను. తల్లిచావుతో మేరీ కార్పెంటరు కన్యకు సంసారబంధము లన్నియు విడిపోయి, తనకాలమును నిరంతరాయముగా మంచిపనులయందు వినియోగపఱుచుటకు మిక్కిలి యనుకూల్యము కలిగెను. అందుచేత నామె మాతృవియోగదుఃఖము తలఁపునకు రాకుండునట్లుగా సత్కార్యాచరణమునందు విరామము లేకుండ పాటుపడఁ దొడఁగెను. 1856 వ సంవత్సరమున నామెతోఁ గలిసి పనిచేయుటకయి చేరిన మిస్ ఫ్రాన్సిస్ పవర్ కాబ్బ ఆమెను గూర్చి యిట్లు వ్రాసెను.—"అర్ధమనుష్యుని భోజనముతో కార్పెంటరుకన్య ముగ్గురు మనుష్యులపనిని చేయుచున్నది."

1858 వ సంవత్సరమునం దామె యొకకన్యనభిమానపుత్రికనుగా స్వీకరించి పెంచనారంభించెను. ఈవిషయమునుగూర్చి యొక చెలికత్తె కామె యిట్లు వ్రాసెను. "నీవు కనపట్టి బిడ్డలను నీకిచ్చి యున్నానని సద్గ్రంథాదేశములో వ్రాయఁబడియున్నది. అంతకుముందు తల్లిప్రేమ యెట్టిదో యెఱుఁగని యనేకులకు నాహృదయాంతర్గతమగు మాతృప్రేమను జూపియున్నాను. వివాహ మాడవలసినకష్ట

మక్కఅ లేకకనకుండ సిద్ధముగాఁ జేయఁబడి చేసెకంది నాకులభించిన జననీజనకహీనయయిన యీయాయువేడ్ల పసిబాలికకుఁ గూడిన నాభాగ్యమును జూపుము.''

వృద్ధదశలో నితరులపేక్షించెడు విశ్రాంతి యామెకు పనిచేయకుండుటవలనఁగాక వేలువేలుపనులకుఁ బూనుటలో నేకలుగుచుండెను. 1861 వ సంవత్సరమున దామె డైరగునకు బోయి యచ్చట కారాగృహములను పరీక్షించి వానినిగూర్చి యుపయోగకరమయిన చరిత్రము ప్రకటించెను. మరి మూఁడు సంవత్సరముల కామె ''మన కారాబద్ధులు'' అను నామముతో రెండుసంపుటముల గ్రంథమును ప్రకటించి, దానిలో కారాగృహస్థుల స్థితినిగూర్చియు నాదరణమును గూర్చియు విశదీకరించెను. ఆమె స్త్రీపిల్లలవిషయమునఁ దాను నడపిన క్రియలనుబట్టి ప్రత్యేకవిషయమునఁ గూడ నట్లే నడపుట శ్రేయోదాయకమని యభిప్రాయపడెను.

ఆమె కలుగదిన నన్నిములు నిరాశనప్పుడు దుఃఖమునుతగ్గించుటకును నేరములు తగ్గించుటకును దాను జేసినప్రయత్నము లన్నియుఁ దానెప్పుడు నెదురుగూడక జయప్రదముగాఁ గొనసాగినందుకు సంతోషించి, తన్నుత్యాగసిద్ధులలో నొకతెగా భావించుకొనెను. అయినను దానంతటితో సంతృప్తి నొందియూరకుండక హిందూదేశమునకుఁబోయి చూచి దానికి మేలు చేయవలెనని తలచెను. ఆమె హిందూదేశమునకుఁ బైలు వెడలుటకు ముందుగా ''రాజా రామమోహనరాయల యొక్క యింగ్లండులోని కడపటిదినములు'' అను పుస్తకమును రచించి 1866వ సంవత్సరము సెప్టెంబరు నెల మొదటితేది నోడయెక్కి చిరకాలమునుండి యుద్దేశించుకొనియున్న హిందూదేశయాత్ర నిప్పుడు నెఱవేర్చెను. ఆమె యెక్కినయోడలోనే యెక్కి మానమోహనఘోషనునతఁడు న్యాయవాదిగాఁ బనిచేయుటకయి మరల నీదేశమునకు

వచ్చెను. ఆమె బొంగాయినగరములో దినములుండి బొంబయి రాజధానీ ప్రభుత్వమువారు సమాన్యముగా విద్యావిషయమయి కార్పెంటరుకు [illegible] విశేషములన్నియు నియ్యవలసినదనియు శాలా రకును తదితరులకును చెప్పి [illegible] శోధకాలయములయొక్క వృత్తాంతము లను తెలుపవలయు ననియు స్థానికోద్యోగస్థుల కాదేశించి నాజ్ఞాపత్రి కలను బంపిరి. ఆ రాజధానిలో నామె మొదట జూచినస్థల ములలో అహమదాబాదు పట్టణము. ఆపట్టణమున నప్పటికే స్త్రీవిద్య యొంత యభివృద్ధిలోనుండెను. అహమదాబాదునుండి యామె సౌరాష్ట్రపురము (సూరతు) నకుం బోయి, యచ్చటనుండి నాసిక [illegible] పురమువచ్చి చేరెను. సౌరాష్ట్రపురిలో "[illegible]" యను గ్రంథము నొక హిందూసు దరితర [illegible] గ్రంథకర్త చదివెను. ఆమె నాసికనగరములో కొన్నిదినములుండి యచ్చటి విద్యాశా లలు మొదలగువానిని పరీక్షించి, అక్కడనుండి పూనానగరమునకుం బోయెను. పుణ్యపురిలో నప్పు డచ్చటివా రామె నాదరించి మిక్కిలి గౌరవించిరి. కలకత్తానగరములో నచ్చటి రాజప్రతినిధిగా రయిన లారెన్సు ప్రభువుగారామెను స్వగృహములో నుంచుకొని సమ్మానించి [illegible] ము గాచిరి. ఆమె కలకత్తా నగరములోను దాని సమీపగ్రామములలోను గలపాఠశాలలు మొదలగు నవాని నన్నిటిని, [illegible] యనేకోపయుక్తాంశములను గ్రహించి, వానింబట్టి తనకుం దోంచిన యభిప్రాయములను నభివృద్ధిమార్గ ములను దొరతనమువారికిం దెలిపెను. ఆమె యక్కడనుండి బొంబయి నగరమునకుం బోయి, యచ్చటివా రా మహాజనులచే నియ్యంబడిన యభి నందనపత్రికను గైకొని, 1867వ సంవత్సరము మార్చి నెలలో బొంబయినగ రమునం దోడ నెక్కి స్వదేశమునకు వెడలెను. ఆమె స్వదేశమును జేరినతో డనే "హిందూదేశములోని కారాగృహశిక్షనుగూర్చియు స్త్రీవిద్యనుగూ ర్చియు సూచనలు" అను పేరుతో నొక చిన్నపుస్తకమును బ్రకటించెను.

మఱునటిసంవత్సరమునం దామె "హిందూదేశమునం దాఱునెలలు" అను పుస్తకమును జేసి దానిని రామమోహనరాయల కంకితము చేసెను. ఆమె హిందూదేశమునకు వైలుదేఱినప్పుడు హిందూస్త్రీలను స్వదేశమునకుఁ దీసికొనిపోయి విద్య చెప్పించి యుపాధ్యాయినులనుగా దిద్దింపవలె ననుకొనెను గాని యామెకు నారోగ్యము గానకుండి నందున తరువాత నామె యుద్దేశమును విడిచిపెట్టెను. ఆమె ప్రాణమిత్రులు సహితము నామె తలఁచినట్లు హిందూదేశమునకు విశేష లాభము కలుగునని తలఁపలేదు. "ఇక్కడి పెద్దలు మాటలలో పెద్ద నోరు చూపుటయేకాని క్రియలలో శూన్యహస్తములు చూపుదు రని ముందు నీవే తెలిసికొందువు" అని యొక హిందూమిత్రుఁ డామెతో ననెను. ఆమె నంతగా ప్రోత్సాహపఱచిన కేశవచంద్రసేనుఁడు సహితము "కార్పెంటరుకన్య హిందూదేశమును విడిచి వెనుకతిరుగఁగానే సత్కార్యవిషయమైన పరిశ్రమయు శూన్యవాయువులో నశించిపోయెను" అని పలికెను.

ఇట్టివాక్యములచేత నామె నిరుత్సాహురాలు గాక యామె యీహిందూదేశమునందలి ప్రముఖులతో నుత్తరప్రత్యుత్తరములను జరుపుచు వచ్చెను. బొంబయిలో న్యాయాధిపతియైన గోపాలరావు హరిదేశముఖుగారి యుత్తరమువలన నామెకు స్త్రీబోధనాభ్యాసనపాఠశాలలను బెట్టింపవలె నన్న నిశ్చయము కలిగెను. అతఁడు చిన్నతనములో వివాహము లగుచుండుటవలన బాలికలు పాఠశాలలను విడిచి తామావఱకు నేర్చుకొన్న యల్పవిద్యనుగూడ మఱచిపోవుచుండుటనుబట్టి బాలికాపాఠశాలలవలనఁ బ్రయోజనమంతగాఁగలుగకున్నదని తెలిపి, "దేశాచారమునుబట్టి యెప్పుడును పునర్వివాహమునుచేసికొనకుండెడు వేలకొలఁది వితంతువుల నుపయోగమునకుఁ దీసికొని రావలెను; అర్హురాండ్రయిన యుపాధ్యాయినులను దిద్దిపంపుట కేర్ప

డినబోధనాభ్యసనపాఠశాలయొకటి స్థాపింపఁబడువఱకును స్త్రీవిద్యాభి వృద్ధినిగూర్చి నేర్పఱిచెడి యేపథకమును సఫలము కానేరదు. హిందూదేశముయొక్క ప్రా ంతమందున్న మీమందఱమును మీ ప్రయత్నముయొక్క పర్యవసాయమునకును మీయొక్క పునరాగమన మునకును అత్యాతురతతో నెదురుచూచుచున్నాము.” అనివ్రాసె ను. అందుపయిన నామె హిందూదేశమునం దప్పుడధికారములోనున్న వారికి స్త్రీబోధనాభ్యసన పాఠశాలల యావశ్యకతనుగూర్చి తెలిపి హిందువు లందఱును జేరి సంవత్సరమునకు 1500 పౌను లిచ్చెదు పక్ష మునం దామంత సొమ్మును బొంబయిలోను అహమదాబాదునగరము లోను స్త్రీబోధనాభ్యసనపాఠశాలలను బెట్టుట కిచ్చెదమని బొంబయి దొరతనమువారు వాగ్దానముచేయునట్లుచేసెచందాలు వేసి యంతసొమ్ము పోఁగుచేయునట్లు హిందువుల నాపనికిఁ బ్రోత్సాహపఱుపఁజొచ్చెను.

ఆమె చేసిన కర్తవ్యోపదేశము ననుసరించి హిందూదేశప్రభు త్వమువారు జనుల తోడ్పాటు నపేక్షింపకయే బొంబయినగరములో స్త్రీబోధనాభ్యసనపాఠశాలను స్థాపించుటకును ఐదుసంవత్సరముల వఱకును సంవత్సరమునకు పండ్రెండువేలరూపాయల నిచ్చుటకేర్పాటు చేసిరి. ఈ ప్రకారముగాఁ దనకృషి ఫలోన్ముఖమునకు వచ్చునూచనలు గాంచి సంతోషించి యత్యుత్సాహముతో 1868వ సంవత్సరము నవంబరునెల మొదటితేదియం దామె రెండవసారి హిందూదేశమునకు వచ్చెను. ఆమెబొంబాయినగరముచేరినతోడనే యచ్చట స్త్రీబోధనా భ్యసనపాఠశాలలోనధ్యక్షురాలుగానుండి జీతముగైకొనక ధర్మార్థము గాఁ బనిచేసెదనని దొరతనమువారికివిన్నపము చేసెను. వారామెప్రార్థ నను గృతజ్ఞతాపూర్వకముగా నంగీకరించిరి. ఉష్ణదేశములోనుండిపని చేయుటచే నారోగ్యము చెడిపోవుటచేతను మఱికొన్ని కారణములచే తను దనపనిని విడిచిపెట్టి యామె మఱుసటిసంవత్సరారంభము సం

దింగ్లండునకుఁ బోవలసినదాయెను. అయినను మరల నామె యాసంవత్సరాంతమునందే హిందూదేశమునకు మూఁడవసారి వచ్చి స్త్రీవిద్యాభివృద్ధినిమిత్తమయి కొంతపని చేసి మరల స్వదేశమునకుఁ బోయెను.

1870 సంవత్సరమునందు కేశవచంద్రసేను లింగ్లండునకుఁ బోయినప్పుడు జూన్ నెలలో బి-స్టల్ నగరమునకరిగి, మేరీకార్పెంటరు కన్యను సందర్శించి, హిందూదేశమును గూర్చిన జ్ఞానమును వృద్ధిచేయుటకును హిందూదేశములోని సాంఘికలోపములను వారించుటకును నొకసమాజమును స్థాపించుట యుచితమని యతఁ డామెదర్శనము చేయుటకు బ్రిస్టల్నగరమునకుఁ బోయినప్పుడు "దేశీయహిందూదేశసమాజ" (National Indian Association) మనునామము తో నొకసమాజము స్థాపింపఁబడెను. ఆసమాజముయొక్క యుద్దేశములను నెఱవేర్చుటకయి సమాజముపేర నొకమాసపత్రికప్రకటింపనారంభింపఁబడినది. ఆపత్రిక యిప్పు డిండియాపత్రిక (The Indian Magazine) యనుపేరఁ బరఁగుచు, తత్స్థాపకురాలి యనంతర మామెపదమును వహించిన యత్యంతయోగ్యురాలగు మానింగుకన్య (Miss Manning)చే మహాసమర్థతతో నిప్పటిదాఁకనిర్వహింపఁబడుచుండెను. ఈసమాజమును మన దేశమునందనేకస్థలములలోనున్న ని శాఖలును మన దేశమునకు మహోపకారము చేయుచున్నవి.

1875-76 సంవత్సరములో కార్పెంటరుకన్య కడపటిసారి మన దేశమునకు నాలవపర్యాయమువచ్చెను. ఆమె స్త్రీలవిషయములలోను జెఱసాలలవిచారణవిషయములోను, పావనివర్తకపాఠశాలలవిషయములోను, కర్మశాలలవిషయములోను, వృత్తిశాలలలో స్త్రీలను పిల్లలను నిలోనుంచువిషయములోను ముఖ్యముగాఁ బనిచేసెను. తాను జేసిన నివలనఁ గలిగిన ఫలితములనుగూర్చి యీమెసాలిస్బరీ ప్రభువునకు

వ్రాసినయుత్తరములో విపులముగాఁ దెలిపినది. అవి యామెతరువాత పార్లమెంటు మహాసభవారియెదుటఁ బెట్టఁబడినవి.

1877 వ సంవత్సరము ఏప్రిల్ నెల 3వ తేదీతో నామెకు డెబ్బది సంవత్సరములు పూర్తియయ్యెను. ఆమె జన్మోత్సవదినమునం దామె నభినందించుచు బంధువులయొద్దనుండియు మిత్రులయొద్దనుండియు నాశీర్వచనపత్రికలును పారితోషికములును విస్తారముగా వచ్చినవి. ఆసంవత్సరము 14వ జూన్ తేదీని దినమెల్ల పుణ్యోపకారిణితో సల్లాపసౌఖ్యమనుభవించి యారాత్రి పడకకు బోయి తెల్లవారులోపల నామె యనాయాసమరణము నొందెను. ఆమెశరీర మార్నోకనుచుచునందు భూస్థాపిత మొనర్పఁబడెను. ఆమె శవమును సమాధికిఁ గొనిపోవునప్పుడు సంఖ్యాతీతులైన మిత్రులును, శోణగృహశోధనాలయములోని బాలురును బాలికలును, పరిశ్రమకర్మాగార శాలలలోని బిడ్డలును, దంగస్సువృత్తకర్మవిద్యాలయములోని బాలురును, వెనుకను లోకమునకును మహోపకారిణియైనట్టియు బిడ్డలను బీదతనమును రోయు శాపములనుండియు రక్షించుటకై తనజీవితమును ధారపోసినట్టియు నాయుత్తమాంగన యొక్క శవమువెంట శోకించుచు ప్రేతసమునకు వేలకొలదిగా బోయి తమ కామెయెడలఁ గలభక్తిగౌరవములను వెల్లడించిరి. మనదేశపుస్త్రీలీమెవలె లోకోపకారకృత్యములయందుఁ దమకాలమును గడుపుటకు బ్రయత్నింతురుగాక!

బాకస్ ప్రెస్, రాజమహేంద్రవరము—1950.

# జీసస్ చరిత్రము

గ్రంథకర్త:

కందుకూరి వీరేశలింగము పంతులు

ప్రకాశకులు:

హితకారిణీ సమాజము

రాజమహేంద్రవరము

1951

 [వెల రు 2-0-0

# LIFE OF JESUS

# జీసస్ చరిత్రము



## మొదటి ప్రకరణము.

### జీసస్‌యొక్క జననమును, బాల్యదశయును.

క్రైస్తవమతస్థాపకుఁడైన జీసస్‌యొక్క బాల్యదశను గూర్చి మన కంతగా తెలియదు. ఆయనచరిత్రమును వ్రాసినవా రాయనయొక్క బాల్యావస్థలో నడచిన వృత్తాంతము తమకు తెలియకపోవుటచేతనో, అప్పటి వృత్తాంతము ముఖ్యమైనది కాదని భావించుటచేతనో, మఱి యేహేతువు చేతనో, దానిని విడిచి యతఁడు మతబోధ కారంభించినతరువాత జరిగినవృత్తాంతము నుమాత్రమే విశేషముగా వ్రాసియున్నారు. ఒక్క బాల్యావస్థనుగూర్చి మాత్రమే కాక యాఘనుని జననదిన మిది యని సహితము నిశ్చయముగాఁ దెలియదు. మన యాసియాఖండముయొక్క పశ్చిమదిగ్భాగమునం దున్న పాలస్టిన్ దేశములో నుత్తరపువైపున గాలిలీ మండలములో నాజరెత్తను గ్రామ మొక్కటి గలదు. ఆగ్రామమునం దిప్పుడు మూఁడునాలుగు వేలజనులున్నారు. పూర్వకాలమునందు సహిత మీగ్రామ మిప్పటి కంటె పెద్ద దయి యుండదు. ఈగ్రామ మొక పర్వతము యొక్క ప్రక్కను గట్టఁబడియుండుటచేతను పెక్కు పర్వతములు సమీపమునం దుండి యుండుటచేతను మిక్కిలి మనోహరముగా నుండును. సుందర

మైన యాగ్రామమునందు 'జోసఫ్' అను పేరు గల వడ్రంగి యొకఁడు మేరీ యను పేరుగల తన చక్కని చిన్న భార్యతో వాసము చేయుచుండెను. ఆదంపతులు ధనికులు కాకపోయినను, చుట్టుపట్టుల నున్న యితరశిల్పులకంటె నెక్కువబీదస్థితిలో నుండినవారు కారు. ఆకాలమునం దెవ్వరును మహాధనికులుగాఁ గాని, కూటిపేదలుగాఁ గాని యుండక యెల్లవారును అన్నవస్త్రములకు లోపములేని సామాన్యదశలో నుండిరి. ఆకాలమునందు జోసఫ్ చేతులార కష్టపడి పని చేసి జీవనము చేయవలసిన స్థితిలోనే యుండినను, అతఁడు తద్దేశమునకు రాజధాని యైన జెరూసలేము నగరమును స్థాపించినట్టియు, హెబ్రూజనుల కాదిమచక్రవర్తి యైనట్టియు, డేవిడ్డుయొక్క సంతతి వాఁడైన మహాకులీనుఁ డని చెప్పుచున్నారు. ఈ సంబంధముననే యాకాలమునందు రాజాజ్ఞచేత వేయఁబడిన జనపరిగణనము నిమిత్తము జోసఫ్ గర్భవతియై యున్న తన నూతనవధువగు మేరీతోఁ గలిసి తన పూర్వుల వాసస్థాన మైన బెథల్‌హేము నగరమునకుఁ బోవలసినవాఁ డయ్యె ననియు, అతఁ డక్కడ నొక సత్రమునకుఁ బోయి యందు చోటుగానక దానితోఁ జేరియున్న యొక పశువులశాలలో వసించి యుండఁగా డేవిడ్డు మహారాజు యొక్క జన్మస్థాన మైన యానగరము నందే యతనిభార్య రాత్రివేళ గడ్డివామిలో నొక పురుష శిశువును ప్రసవించె ననియు, కొందఱు వ్రాసియున్నారు. అప్పుడట్లు పుట్టిన యాశిశువే క్రైస్తవమతస్థాపకుఁ డైన జీసస్. *ఆశిశువు పుట్టిన దినమును సరిగా కనుఁగొనుట కాధారము లేవియు లేక పోయినను,

* జీసస్ క్రైస్తనునది జీసస్‌యొక్క సంపూర్ణనామము. అతఁడు సాధారణముగా క్రైస్తనియు పిలువఁబడును. ఈకడపటినామము వచ్చుటకుఁ గల కారణము ముందు వివరింపఁబడును.

అతఁడు క్రీస్తుశకమునకు నాలుగుసంవత్సరములు ముందు జనవరినెల మొదటి తేదికి మూఁడునాలుగుదినము లీవలనో యావలనో జనన మొందినట్లు చూపుటకుఁ దగిన నిదర్శనము లున్నవి. ప్రభుత్వమువారి యాజ్ఞను బట్టి వేయఁబడిన యీ జనపరిగణనము క్రీస్తుపుట్టిన పదిసంవత్సరములకు తరువాతఁగాని జరగనందున నతఁడు బెథల్‌హేమునగరమున జన్మించుట సత్యము కాదనియు, ఆకాలపువారిచే నతఁడు 'నాజరెత్తుపుర జీసస్' అనియే పిలువఁబడుచు వచ్చుటచేతను, కొంద ఱతఁడు నాజరెత్తులోనే పుట్టెనని చెప్పుచుండుటచేతను జీసస్సు నిజముగా నాజరెత్తుగ్రామములోని జనసఘుండే ననియు, అతఁడు డేవిడ్డురాజవంశజుఁ డయినట్లును బెథల్‌హేమునగరము నందు జన్మించినట్లును తరువాతివా రాకని స్వాత్మ్యప్రాశస్త్యమును స్థాపించుటకొఱకును ప్రాఁతనిబంధనలో ముందపతికిఁ బోవుచున్నాఁ డని చెప్పఁబడిన దేవదూత యితఁడే యని సాధించుటకొఱకును కల్పించి రనియు, కొందఱు బుద్ధిమంతు లభిప్రాయపడుచున్నారు. లోకోపకారులైన మహాపురుషులకు వారి తరువాతివారు మహాత్మంశసంభవతయు దేవాంశసంభవతయు నారోపించుట యెచ్చటను క్రొత్తగాదుగదా! మనదేశమునందుసహితము శంకరాచార్యులు మొదలగు మహాపురుషులెందఱుమనవారిచే దేవాంశసంభూతులుగా పరిగణింపఁబడు చున్నారు కారు? పూర్వులస్థితియెట్టిదయినను, ఆశిశువుజనించినప్పుడాతనిజననీజనకులు ధనసంపన్నులుగాని కులములో ప్రాముఖ్యము కలవారుగాని కారు. జీసస్సుయొక్క గ్రామమునకు బెథల్ హేమునగరము మూఁడుదినముల ప్రయాణములో నున్నది.

ఇట్లు పేదయింట జనన మొందిన యాశిశువునకు తల్లిదండ్రులు జీసస్సని నామకరణము చేసిరి. ఆపదమునకు రక్షకుఁ డని యర్థము.

గలరుగాని వారప్రసిద్ధులు. ఆతనిసోదరులని చెప్పఁబడి ప్రసిద్ధిగాంచిన నలుగురుపురుషులును వారిలో ముఖ్యముగా క్రైస్తవమతారంభదశ యందు సుప్రసిద్ధుఁ డయినజేమ్సనునతఁడును పినతల్లికొడుకులుగాని సాక్షాత్సహోదరులుగారు. జీసస్‌తల్లి యైన మేరీకి మేరీ యనుపేరు గల చెల్లెలొకతె కలదు. ఆమెభర్త క్లియోపస్సను నామాంతరము గలయాల్ఫియస్సనువాఁడు; ఆమెకు కొడుకు లనేకులు గలరు; వారు జీసస్సునకు మొదటిశిష్యులయి ప్రఖ్యాతి గాంచిరి. ఏకగర్భజనితు లయిన తమ్ములే ప్రతికూలురుగా నున్నప్పుడు జీసస్సునకు వీరనుకూలు రుగా నుండి తోడుపడుటచేత తరువాత పినతల్లికొడుకు లయినవీరికే "ప్రభుసోదరు" లన్నపేరు వచ్చినది. అతనిఁ గన్నతల్లికివలెనే నిజమైన సోదరులకును జీసస్సుయొక్క మరణానంతరమునఁగాని గౌరవము రా లేదు. అతని తోడఁబుట్టినపడుచులు వివాహము లాడి తమభర్తలతోఁ గూడి నాజరెత్తు గ్రామములోనే కాపురము చేయుచుండిరి. ఈ చెల్లెండ్రును తమ్ములును తనతోడఁగూడి క్రీడించుచుండఁగా జీసస్సు కొంతకాలము చిన్నతనములో తల్లియింట విహరించెను. అప్పుడామె తనతోడి చేడియలతోఁగూడి ముచ్చటించుచు వీధిలోని నూతివద్దకుఁ బోయి పసిపిల్లను చంక నిడుకొని పెద్దకొడుకును కేలూఁతయిచ్చి నడపించుచు బుజముమీఁది బిందెతో మందగమనంబున నింటికి వచ్చి వలు మాఱు భర్తకు నేత్రానందము కలిగించి యుండును. అయినను జీసస్సునకు యౌవనము రాకమునుపే తండ్రి కాలము చేసినట్లు కనఁ బడుచున్నది. ఉష్ణదేశ మగుటచే నతఁడు ధరించినవస్త్రములు పలుచని వయి యుండవలెను. అతఁ డాటలకయి గ్రామసమీపమున నుండు కొండలకుఁ బోయి తోడిబాలకులతోడఁ గూడి విహరించి యుండును. కొంతసే పాటలాడివచ్చి యతఁడు వడ్రపుపనిలో తనతండ్రికి తోడు

పడుచుండియు నుండవచ్చును. అతఁడు చిన్నతనములో తండ్రివద్ద పని నేర్చుకొని కొంతకాలము కులవృత్తిని చేసె ననుటకు సందేహము లేదు.

ఆకాలమునం దతఁడును తక్కినబాలకులవలెనే వీధిబడికిఁ బంపఁబడెను. ఆబడులయందు చెప్పబడినది యంతయు చదువుటకును వ్రాయుటకును నేర్పుటయు, కొన్నిపద్యములను కంఠపాఠము చేయించుటయు మాత్రమే. ఆకాలమునం దిప్పటివలె నచ్చుపుస్తకములు లేనందున, ఉన్నపుస్తకములు కొన్నియు తాకులమీఁద వ్రాయఁబడుచుండెను. అతఁడు దేశభాష యైన సిరియాభాషలో వ్రాయుటకును చదువుటకును నేర్చుకొనుటయేగాక, మతగ్రంథము లన్నియు మన దేశమునందు దేశభాషలలోఁ గాక సంస్కృతభాషలో నున్నట్లే యాదేశమునందు హీబ్రూభాషలో నుండుటచేత ప్రాఁతనిబంధన (Old Testament) మొదలగు కొన్నిమతగ్రంథములను, మతగ్రంథములకు రాబీ లనఁబడు పండితులు చేసిన కొన్నివ్యాఖ్యానములను, హీబ్రూభాషలోఁ జదివెను. అంతేకాని, యాతని కా కాలమునందు పండితు లనఁబడువారి కుండిన దురవగాహమై నిష్ప్రయోజన మైన పాండిత్యప్రకర్షముగాని తర్కైకమూల మయిన గ్రీకుశాస్త్రతత్త్వజ్ఞానముగాని లేదు. అతఁడు గ్రంథములను విస్తారముగా చదివినవాఁడు కాకపోయినను చదివిన కొన్నిగ్రంథములను చక్కఁగా గ్రహించి దృఢముగా మనస్సున నాటించుకొనెను. ప్రాఁతనిబంధనమునందలికీర్తనల (Psalms) లోను దీర్ఘదర్శుల వ్రాఁతలలోను విశేషభాగ మాతనికి ముఖస్థముగా వచ్చును. ఆగ్రంథములలోని నీతిబోధకములును భక్తిప్రదాయకములును నైన యుత్తమవాక్యములు చిన్నతనములోనే యాతనిమనస్సునందు శిలాక్షరములవలె దృఢముగా

లగ్నము లయి యుండు పూర్వబోధము మహాకావ్యమున కాదని వ్యాఖ్యానిం జేసెను. జీవితమును శాంతతతో సహించుటలోను, హృదయాకర్షక మైన సద్వర్తనమును కలిగి యుండుటలోను, స్వప్రయోజనపరులయి వంచకు లయిన మతాచార్యు లుపదేశించు దుర్బోధనల ఖండించుటలోను, అతఁడు కొంతవఱకు హెగెల్ చూపిన మార్గము ననుసరించెను. కారణము కలుగుటకయి పురాతన దీర్ఘదర్శుల పేరులు రచియింపఁబడిన యాధునికగ్రంథములు కొన్ని యాతనికి చిత్తాహ్లాదకరములుగా నుండెను. వానిలో ముఖ్యముగా డానియల్ పుస్తక మాతనికి ప్రియతమ మయినది.

ఆతనికి యూదమత (Judaism) మొక్కటిదక్క మరియే మతమునగూర్చియు విశేషముగా తెలియదు. యూదులు ప్రతిమార్చనాదులు లేని యేకేశ్వరారాధనముచేసెడి యాస్తికులు. క్రైస్తవులలో వలె భానువారముగాక వారికి శనివారము విశ్రాంతిదినముగా నుండెను. ఆవిశ్రాంతిదినము శుక్రవారము సూర్యాస్తమానములో నారంభ మయి శనివారము సూర్యాస్తమానమువఱకు నుండును. యూదుల కది కేవలవిశ్రాంతిదినముగా నుండక మనదేశములోని వైష్ణవులకు హరివాసరము (ఏకాదశి) వలె వ్రతదినముగా కూడ నుండెను. శనివారమునాఁ డెవ్వరును నేపనియుఁ జేయఁగూడదు; నాఁడు వంటసహితము చేసికొనఁగూడదు; శనివారమునాఁడు సాయంకాలము వఱకును కుటుంబమునకు సరిపోవు భోజనపదార్థములనన్నిటిని గృహిణి శుక్రవారమునాఁడు మధ్యాహ్నముననే సంసిద్ధము చేసియుంచవలెను; విశ్రాంతిదిన మారంభ మగునప్పటికి ఒక దివ్వె మండుచుండఁజేసినపక్షమున, ఆఱనీయక యాదివ్వెను విశ్రాంతిదినము ముగియువఱకును మండుచుండునట్లు చేసి కాపాడవలెను; విశ్రాంతిదిన మారంభ

మగునప్పటి కింట నిప్పు లేనిపక్షమున, ఆదినము కడచనువఱకును నిప్పు తగిలింపకూడదు; ఆదినమున నెవ్వరును మూటనుగాని మఱి యేవస్తువునుగాని వహించి వీధిలో పోఁగూడదు; నాఁటికి నియమితమయి యున్న పావుక్రోసుదూరములోనే దక్క దానిని దాఁటి యెవ్వరును నడవఁగూడదు; నాఁ డేవిధమయిన యాటలను పిల్లలుసహితమాడఁగూడదు. నాఁటిదిన మామతస్థులు చదువుకొనుటయు మాటాడుకొనుటయు దేవాలయమునకుఁ బోవుటయుఁ దక్క వినోదార్థముగా మఱి యేపనియుఁ జేయఁగూడదు. ఆదినమున దేవాలయమునకుఁ బోవుట యొక్కటిమాత్రమే పిన్నపెద్దల కందఱకును సమానముగా గొంతసంతోషకరముగా నుండుచు వచ్చెను. దేవాలయముయొక్క బహిర్ద్వారము దాఁటగానే లోపల పెట్టబడి యున్న చిన్నపెట్టెలో దీనులకు ధర్మార్థముగా నిచ్చుటకయి యక్కడకుఁ బోయినవారందఱును తమ శక్తికొలఁదిని కాసువీసములను వేయుచుందురు. ఆలయమునకుఁ బోయినతరువాత లోపల నిరుప్రక్కలను రెండేసివరుసల యున్నతాసనములు వేయఁబడి యుండును. అం దొక్కప్రక్కను పురుషులును రెండవప్రక్కను స్త్రీలును కూరుచుందురు! ఆలయములో నించుమించుగా మధ్యభాగమునం దున్న వేదికమీఁద నాచార్యుఁడు కూర్చుండుట కయి యొక యుచ్చపీఠము వేయఁబడి యుండును. గర్భాలయములో రాత్రిందినములు సదా దీపము వెలుగుచుండును. అక్కడి జనులు విగ్రహారాధకులు కానందున దేవాలయములో విగ్రహము లుండవుగాని యొకయఱలో మతగ్రంథములు మాత్రము పెట్టఁబడి యుండును. దేవాలయమును సందర్శింపవచ్చువారు తమపాదుకలను వెలుపలనే విడిచి వట్టికాళ్ళతో చప్పుడు గాకుండ నడచి లోపలికి వచ్చి కూరుచుందురు. యుక్తకాలమున నందఱును సమావేశ మయిన

తరువాత నాచార్యుఁడుగాని పాఠకుఁడుగాని లేచిపోయి వేదికమీఁది
పీఠము నధిష్ఠింపఁగానే యెల్లవారును లేచి నిలువఁబడి కొంతకాలము
తమమనస్సులలో నీశ్వరధ్యానము చేయుదురు. అంతట జనులట్లు
నిలువఁబడియుండఁగానే పాఠకుఁడు తాను వ్రాసికొని వచ్చినప్రార్థనము
చదువనారంభించును. అతఁడు వాక్యమును ముగించినప్పు డెల్లను
జను లేకగ్రీవముగా నడుమనడుమ "తథాస్తు" అని భక్తిపూర్వకముగా
పలుకుచుందురు. ఈప్రకారముగా ప్రథమప్రార్థనము ముగిసినతరు
వాత పాఠకుఁడు హీబ్రూభాషలో ధర్మశాస్త్రములనుండి కొన్ని
వాక్యములను చదువఁగా జనులకుఁ దెలియుటకయి యాచార్యుఁడు
దానిని దేశభాషలలోనికి భాషాంతరీకరించి చెప్పును. అటుపిమ్మట
మరల నొకప్రార్థన జరిగినపిమ్మట మఱియొకసారి దీర్ఘదర్శులపుస్తక
ములలోనుండి కొన్ని భాగములు చదువఁబడును. అవి సమాప్తినొందిన
పిమ్మట దేవాలయమునకు వచ్చినవారిలో నొకపండితుఁడు గాని
సమర్థుఁ డయినయితరుఁడు గాని యాచార్యునియాజ్ఞను బొంది
యొకధర్మోపన్యాసము చేయును. ఆయుపన్యాసాంతమునం దచ్చటి
వారు లేచి దానిమీఁద ఖండనముగాఁగాని మండనముగాఁగాని
తమకుఁ దోఁచినయభిప్రాయమును యథేచ్ఛముగాఁ దెలుప నారం
భింపఁగా, ఆయుపాసనామందిర మప్పుడు శాంతిప్రద మైనయాశ్వరో
పాసకసమావేశమువలె నుండక పండితగోష్ఠి వలె కోలాహలధ్వనితో
నిండి పోవును. ఇట్లు వివాదములు జరుగుచున్న సమయమునందు పాఠ
కుఁడు లేచి ప్రార్థనను చదువుటకు నిలువఁబడఁగానే మరల సర్వమును
నిశ్శబ్ద మగును. అంతట పాఠకుఁ డంత్యప్రార్థననుజేసి యాశీర్వదించి
యుపాసనమును ముగించును. ఆవల జనులు లేచి యెవరియిండ్లకువారు
పోవుదురు. స్వగ్రామములోని యిటువంటి దేవాలయమునకు జీసస్సు

బాల్యమైన తల్లిదండ్రులతోఁ గలిసి తఱుచుగాఁ బోవుచుండెను. ఇట్లాలయమునకుఁ బలుమాఱు పోవుచుండునప్పు డచ్చటి యుపదేశములవలనను భక్తిపరు లయిన వారివర్తనమువలనను జీసస్సుయొక్క మనస్సులో తరుణవయస్సులోనే నిశ్చలమైన యీశ్వరభక్తి నాఁటుకొనుటయేకాక బాహ్యమునకు భక్తవేషములు ధరించి వచ్చుచుదాంభికులనటనలమీఁదను భక్తిహీనములైన యనావశ్యకము లైన కర్మములమీఁదను కొంతవఱ కాతని కసూయసహిత ముదయించెను.

యూదులు స్వగ్రామములయందలి దేవాలయములలోఁ జేరి యీశ్వరారాధనము చేయుచుండుటయేకాక యేఁటేట తమపుణ్యస్థలమైన జెరూసలేమునగరమునకు యాత్ర చేయుచుందురు. హిందువులకు కాశీపుర మెట్టి దివ్యస్థలమో యూదులకు జెరూసలేమునగర మట్టి దివ్యక్షేత్రము. పాలస్టీన్ దేశమునకు రాజధాని యైనట్టియు మతమునకు ప్రధానస్థాన మైనట్టియు యూదులక్షేత్రములలోనెల్ల నగ్రగణ్య మైనట్టియు గణన కెక్కిన వారి పూర్వరాజులకు వాసభూమి యైనట్టియు జెరూసలేమునగరమునందు ప్రతిసంవత్సరమును మూఁడు గొప్ప యుత్సవములు జరుగును. ఆయుత్సవముల మూఁటిలో నొక్కటి మిక్కిలి ముఖ్య మయినది. అది మహావైభవముతో ప్రతిసంవత్సరమును చైత్రమాసములో వారముదినము లవిచ్ఛిన్నముగా నడుపఁబడును. వానికి 'ప్యాసోవర్' పండుగని పేరు. ఆమహోత్సవమును జూచుట కయి దేశదేశములనుండి జనులు తండోపతండములుగా యాత్ర పోయి యిసుక చల్లినను క్రింద రాలనట్టుగా పట్టణమునం దంతటను క్రిక్కిఱిసి యుందురు. అప్పు డామహానగరములో స్థలము చాలనందున యాత్రాపరులనిమిత్తము పందిళ్ళును పాకలును వేయఁబడును. ఆయుత్సవమునకు తనతల్లితండ్రులతోఁ గలిసి జీసస్సు పెక్కుసారులు

